భిషగాచార్యులవారి త్రైమాసిక ఆరోగ్యప్రచురములు.



# చలిజ్వరములు లేక మలేరియా.

## వాటివ్యాపనము-చికిత్స.



JUNE 1917.



పింగళ సం॥ ఆషాఢ శు॥ ౧

శికింద్రాబాదు.



భిషగాచార్య. పండిత. హెచ్. సుబ్బరాయశాస్త్రి
కవిరత్న, ప్రధానసంపాదకులు "ఆయుర్వేదోదయ
గ్రంథమాల" వైద్యవిద్వాంసులు.



తిరుపతి రామకృష్ణా ముద్రాక్షరశాల,—శికింద్రాబాదు.

# రాజపోషకులు.

శ్రీ శ్రీ శ్రీ రాజాసీతారామభూపాల, బల్వంత్ బహదూర్ వారు, గద్వాల సంస్థానాధీశులు.

" " సురభిలక్ష్మారావు బహదూర్ వారు, కొల్లాపురపు సంస్థానాధీశులు.

" " నాయని వెంకటరంగారావు బహదూర్ వారు మునగాల సంస్థానాధీశులు.

" " రామచంద్రరావు బహదూర్ వారు, దోమకొండ సంస్థానాధీశులు.

" " గులాబ్ దాసు హరిదాసు అండ్ సన్సు హైద్రాబాదు.

# ప్రధానపోషకులు.

మ॥ రా॥ రా॥ శ్రీ చీకోటి వీరన్నశ్రేష్ఠిగారు, శికింద్రాబాదు.

" బూరుగువిశ్వనాథమయ్యగారు "

" కొంజర్ల. రామన్న శ్రేష్ఠిగారు "

" తాటికొండ. తిమ్మారెడ్డిగారు, దేశముఖ్

# పోషకులు.

మ॥ రా॥ రా॥ శ్రీవి.డి. పిళ్లెగారు, యం.ఇ బి.సి.ఇ. హైద్రాబాదు.

" యం పి. బుచ్చయ్య, వైద్యులు శికింద్రాబాదు.

" మనసాని. రామన్నశ్రేష్ఠిగారు "

" రుమాళ్ల - నారాయణ శ్రేష్ఠిగారు "

ఓం

# జ్వరములు వాటి చికిత్సాక్రమములు.

## ప్రథమాలోచన

## FLASH THE FIRST.

### అధ్యాయము I

పాశ్చాత్యవైద్య శాస్త్రజ్ఞులు విషమజ్వరభేదములగు సన్తత, సతత, అన్యేద్యుష్క, తృతీయక, చతుర్థక జ్వరములన్నియు మన్యపుజ్వరము, వరుసజ్వరము, మలేరియా, శీతకట్టు జ్వరము, మొదలగు నామాంతరములతో వ్యవహరించియుండుట సుప్రసిద్ధముగనున్నది. ఏలనన "మలేరియా" జ్వరము యొక్క చిహ్నము లీరీతిగ వర్ణింపంబడినది.

1. ఏదోయొకక్రమమున అనుదినముగాని, దినమువిడిచి దినముగాని సాధారణముగ చలితో ప్రారంభించి జ్వరము వచ్చుట.

2. ఒకనాటి జ్వరమునకును మఱియొకనాటిజ్వరమునకును మధ్యకొంత విరామకాలము జ్వరము లేకుండుట.

3. ఒకనినుండి మరియొకనికి ఒకానొకవిధమైన దోమవలన వ్యాపించుట.

4. రక్తహీనము, పాండువు, జ్వరగడ్డ మొదలగునవి దీర్ఘజ్వరముచే కలుగుట.

## మలేరియా వ్యాపకము

ఈమలేరియా జ్వరము వికారిణివంటి సూక్ష్మజీవులనేకములు మననెత్తురులో ప్రవేశించుటచే కలుగుననియు, అటుల ప్రవేశముచేయుటకు దోమలే ముఖ్యకారణములనియు నవీన పరిశోధనలవలన కనుగొనియున్నారు. దోమయొక్క కడుపులోను నెత్తురిలోను పిల్లమలేరియా పురుగులనేకము లనేకవిధములైన మార్పులనుజెంది నెత్తురునుండి దోమయొక్క ఉమ్మితిత్తులలో జేరుచుండును. ఒక్కొక్కదోమకాటుకు వందలకొలది పిల్లమలేరియా పురుగులు మననెత్తురిలో కలియుటచే జ్వరములు కలుగుచుండును.

అయిన మనకగుపడు దోమలన్నియు "మలేరియా" జ్వరముకలిగించవు. అందులో పండ్రెండుజాతులుండినను రెండుజాతులమాత్రము రోగహేతుకములై యుండును. ఈ రెండు

క్షములైనదోమలలో "అనాఫోలీసు" జాతియందు ఆడుది మాత్రమే "మలేరియా" పురుగును చేరవేయును. "క్యూలెక్స" దోమ ఏనుగకాలు లేక బూదకాలు అనువ్యాధిని వ్యాపజేయును.





అనాఫోలీసు దోమ క్యూలెక్సుదోమ

దీనిభేదములు, నివాసస్థలములు.

1. 'క్యూలెక్సుదోమలు మనయిండ్లలోను, యిండ్లప్రక్కనుండు నీటిగుంటలలోను, కుండలలోను, పువ్వులమొక్కల కుదుళ్లలోను, పశువుల అడుగులలోనిల్చు చిదప నీటిలోను, ఎక్కడెక్కడ బురదనీళ్లు దొరకినను అచ్చట గ్రుడ్లుపెట్టుచుండును ఈజాతిగ్రుడ్లు దొప్పలవలెనుండు ముద్దగాపెట్టబడి నీటిలో తేలుచుండును.

2. "అనాఫోలీసుదోమలు" గ్రామమునకు కొంచెము

దూరముగానివసించును. చాలరోజులవరకు నిలువయుండునని త్రోచునీటిలోను, నాను, తుక్కుకలసి నెమ్మదిగా ప్రవహించు ఆవలుబండలు మొదలగువానియందును, చేలమధ్యనుండు గుంటలలోను, నీరునిలువయుండు పల్లపుభూములలోను, అది గ్రుడ్లను పెట్టును. ఈదోమ తనగ్రుడ్లను నీటిమీఁద తేలుచుండు ఏదైనఒక పుల్లమీఁదగాని ఒకఆకుమీఁదగాని పెట్టును. నీళ్లలో ఎప్పుడును పెట్టదు.

## మలేరియాచికిత్స.

పాశ్చాత్యులీచలిజ్వరమునకు కనిపెట్టిన చికిత్సలు వేనోళ్ల శ్లాఘింపఁదగియున్నది. 1638 సంవత్సరము దక్షిణ అమెరికాలో "పెరు" దేశపు ప్రభ్వీణియగు "చింకోనా" అనునామెకు జ్వరమువచ్చినప్పుడు ప్రకృత మామె పేరుగల ఓషధియొక్క పట్టవలనగుణమపడియుండుటంబట్టి ప్రసిద్ధిగాంచెను. పెరుదేశములోనున్న జెసూటట్ మిషనరీలు దీనిగుణముం దెలిసినవారై ఫ్రాన్సు దేశపు చక్రవర్తి లూయీ XIV (Louis XIV) అనునతనికి జ్వరమువచ్చినప్పుడు అచ్చటనున్న కార్డినల్ డిలూగో (Cordinal de lugo) అను వైద్యశిఖామణికి యీయోషధి నెగుమతిచేసి

రి అప్పటినుండి యీచింకోనాపట్ట జ్వరములకు దివ్యౌషధం బని ప్రపంచమంతటను వెల్లడిజేయబడెను. క్రీ. వె. సుమారు 1852వ సంవత్సరమందు జావా అనుదేశములో "డచ్చి" వారును ఇంగ్లాండునందు యింగ్లీషువారును చింకోనాతోటలు వేసి అత్యంతలాభమును బొందిరి. చింకోనాపట్టనుండి కలుగు "క్వయినా" అనుపొడి మలేరియాకు దివ్యౌషధంబని సర్కారు వారు సహితము ప్రచురపరచుటచే దీనివ్యాపారము మహోన్నత దశలోనున్నదనియే చెప్పవచ్చును.

## జ్వరమున్నదని తెలియజేయు క్రమములు.

1. జ్వరమున్నదని తెలియుటకొక "ఉష్ణవ్యాపక" (Thermometer) యంత్రముండవలయును. ఆరోగ్యదశయందుసాధారణముగ కక్షభాగమందు చూచిన 98·4 డిగ్రీలుండును. నోటియందు 99·5 డిగ్రీలుండును. యంత్రమధ్యనుండుగీత 99·5 డిగ్రీలకుపైనగాని 97·5 డిగ్రీలలోపలగాని యుండిన ఏదోవ్యాధియున్నదనియే తెలియవలెను. జ్వరముండిన హెచ్చుడిగ్రీలుండును. ఇంద్రియ దౌర్బల్యము, పురాణవ్యాధులు, రక్తస్రావము మొదలగు వ్యాధులయందు తక్కువ డిగ్రీలుండును.

107 డిగ్రీలకు పైగ కాని 95 డిగ్రీలకు లోపలకాని శరీరఉష్ణమున్నటుల తెలిసిన రోగి బ్రతుకనేరడు.

2. చేతిమణికట్టున అంగుష్ఠమూలమందు హస్తాంగుష్ఠములతో పరీక్షించిన నొకవిధమైన చలనము స్పృశించును. దీనికి నాడియనుచున్నారు. ఈచలనము ఆరోగ్యదశలో యీవిధముగనుండును.

బిడ్డపుట్టినది మొదలు మొదటిసంవత్సరమునకు నిమిషమునకు 140 మార్లు చలనముకలుగును.

| | | | |
|---|---|---|---|
| మొదటిసంవత్సరమునుండి | మూడుసంవత్సరములవరకు | 120-100 | ,, |
| మూడుసంవత్సరముల మొదలు | ఆరుసంవత్సరములవరకు | 100-90 | ,, |
| 7 నుండి 14 | సంవత్సరములవరకు | 90-75 | ,, |
| 14 ,, 21 | ,, | 85-75 | ,, |
| 21 ,, 65 | ,, | 75-65 | ,, |
| ముసలితనమందు | ,, | 85-75 | ,, |

జ్వరాదియందు నాడిత్వరగను, గొప్పదిగను, మృదువుగ స్పృశించును.

(3) బిడ్డపుట్టినదిమొదలు రెండేండ్లవరకును నిమిషమునకు 35మార్లుశ్వాసించును. రెండేండ్లనుండి 9 ఏండ్లవరకు నిదురబోవునప్పుడు నిమిషమునకు 18 మార్లును.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ,, | | ,, | హెచ్చరికగనుండునప్పుడు | ,, | 23 | ,, |
| 9 నుండి | 15 | ,, | నిదురలో | ,, | 18 | ,, |
| ,, | | ,, | హెచ్చరికలో | ,, | 20 | ,, |

15 నుండి 21 ,, నిమిషమునకు 15 నుండి 18 మార్లు శ్వాసించుచుందురు.

పైజెప్పిన క్రమముకంటెను హెచ్చుగాశ్వాసము వచ్చుచుండిన శ్వాసకోశములు చక్కగలేవని యూహింపవలెను. జ్వరమందుకూడ హెచ్చుగనేయుండును. తక్కువగనుండినచో దౌర్బల్యము, వాతవ్యాధులని యూహింపవలెను.

(పైమూడుక్రమములు జ్వరనిదానము తెలిసికొనుటకువిధాయకములు.)

జ్వరమువచ్చురోజులలో క్వయినాసేవించుక్రమము.

"మోతాదుకు 5 గ్రేనులచొప్పున దినము 15 గ్రేనులప్రకారము

మూడుసార్లును, జ్వరముపూర్తిగా విడచినతరువాత యిదే ప్రకారము ఒకవారమును, పిమ్మట 15 దినములవరకు ఉదయము 5 గ్రేనులు సాయంత్రి 5 గ్రేనులను పిమ్మట మరి 15 దినములు ప్రతిదినమును ఉదయము 4 గ్రేనుల క్వాయినాపుచ్చుకొనవలెను. ఈదినములలో ఎప్పుడు ఒకసారిఅయినను జ్వరము రాకూడదు. అట్లు వచ్చినయెడల "రెడ్డివచ్చె మొదలిడరా" అన్నట్లు ఈజ్వరము విడచిన దినముమొదలు లెక్కప్రారంభించవలెను. చలిజ్వరము వచ్చినతరువాత 2 నెలలుమొదలు 3, 4, సంవత్సరములవరకు ఒక్కొకప్పుడైనను "క్వాయినా"తీసుకొనవలెను." ఇటుల ఒకసారివచ్చినజ్వరమునకు 3, 4, ఏండ్లు క్వాయినా తీసుకొనుటకువలయు ఖర్చులను, అంతలోపల జ్వరము వచ్చిన మరల ప్రారంభించి అంతకాలము సేవించుటకు పట్టు కాలంబును చదువరులూహించవలెను.

### క్వాయినా విషయములో కొందరిపాశ్చాత్యుల అభిప్రాయము

Dr. Sydney Ringer M. D. says "These alkaloids if too long employed, disorder the stomach producing heat and weight at the epigastrium, loss of Appetite, Neusea, Sickness and Diarrhoea".

డాక్టర్ సిడ్నిరింగర్ యం. డి. దొరగారిట్లు వ్రాయుచు న్నారు. "చింకోనానుంచి తీయబడుపదార్థములు చాలాకాల ముపయోగించిన జఠరమునుచెరచి, జఠరభాగములో ఉష్ణము ను, భారమును కలిగించును. ఇదియుగాక అజీర్ణము, పైత్యము , డులిక, అతిసారము కలుగజేయును."

Dr. A. C. Cowperthwaite M. D. P. H. D. L. L. D. says "The blood becomes hyperfibrinized and the number of red corpuscles diminished thus causing Leucocythaemea and Anaemia resulting in general debility and prostration."

డాక్టరు ఎ. సి. కౌపర్తువేట్ యం.డి.పి.హెచ్.డి.యల్. యల్. డి. దొరగారిట్లు వ్రాయుచున్నారు. "రక్తములోనుం చు తాంతవము నధికపఱచి ఎఱ్ఱరక్తకణములసంఖ్య తగ్గించుట వలన పాండుమొదలగు వ్యాధులుకలుగుటచే అధికబలహీనము లుగును."

Dr. Richard Huges L. R. C. P. (Edin) says 'There is disturbed visual function even to blindness and in the brain itself we have head-ache,

fulness, weight and tension, Vertigo, sometimes Epistaxis."

డాక్టరు రిచ్చర్డు హ్యూచస్ యల్. ఆర్. సి. పి. గారిట్లు వ్రాసిరి. "దృష్టిని చెరచునట్టి నేత్రరోగము కలుగుటయేకాక, మస్తిష్కములో నొప్పి, భారము, ఉబ్బరము, భ్రాంతి, ముక్కులో నెత్తురుకారుట మొదలగునవి కలుగును."

Dr. T. F. Allen M. A. M. D. says "Decided depression of the sexual sphere, disappearance of sexual functions or sexual functions completely lost. An emmission during the night without waking."

డాక్టరు టి. యఫ్. అలెన్ యం. ఏ. యం. డి. గారిట్లు వ్రాసిరి. "పురుషేంద్రియముయొక్క చైతన్యముబొత్తిగాపోవును. స్వప్నస్ఖలనము యిత్యాది యింద్రియ జన్యవ్యాధులు సంభవించును."

Dr. H.C. Wood writes "Brain convulsions have occured, either when the dose was too large or when it was given to a person affected with cerebral disease * * *"

డాక్టరు హెచ్. సి. ఉడ్ దొరగారిట్లు వ్రాసియున్నారు.

"మోతాదుకధికముగా సేవించినను, మస్తిష్కసంబంధముగల వారు పుచ్చుకొనినను అపతానకాప తంత్రకవాత వ్యాధులు సంభవించును."

Dr. Burt and Stille write "It affects Auditary nerves, creates hardness of hearing and in many instances positive deafness has been produced by large doses of Quinine"

డాక్టరు బర్ట్ అండ్ స్టిల్లి యిట్లువ్రాయుచున్నారు. "కర్ణనాడీలను చెరచి ధ్వనివినబడునట్లుచేయును. క్వయినా అధికముగా సేవించిన చెవుడుకలుగును"

అధ్యాయము ౨.

## FLASH THE SECOND.

ద్వితీయాలోచన.

ఆయుర్వేద శాస్త్రప్రకారము జ్వరములెటులకలుగునో కనుగొనియెదము.

మిథ్యాహారవిహారాభ్యాందోషాహ్యామాశయాశ్రయాః
బహిర్నిరస్యకోష్ఠాగ్నిం జ్వరదాస్స్యూరసానుగాః॥

దేశ కాల దేహ ప్రకృతి మొదలగువానికి విరుద్ధముగ నుపయోగింపబడిన జలాహార విహారములచేత వాత, పిత్త, కఫములను దోషములు ఆమాశయమును బొంది జఠరాగ్నిని వెలుపలికి ద్రోసి రసధాతువుతో జేరనవి యగుచు జ్వరమును కలుగజేయునని తాత్పర్యము. ఇచ్చట, దోషములు ఆమాశయమును జేరుట, రసదాతువువలన దూషింపబడుట అను రెండు కార్యములు లేకనే జ్వరములు కలుగదను అభిప్రాయము సూచించుచున్నది. ఇదియెంతనిశ్చయమను విషయము మనయనుభవములోనే యుండుటవలన విమర్శింపనవశ్యకములేదు. రసాదిధాతువు లెప్పుడు దూషింపబడునో అప్పుడేజ్వరమునకు విషమత్వ మేర్పడుచున్నది. అట్టివిషమజ్వరములు 5 విధములు.

శ్లో॥ సన్తతస్సతతో న్యేద్యుస్తృతీయక చతుర్థకౌ॥

సంతత, సతత, అన్యేద్యుష్క, తృతీయక, చతుర్థక జ్వరములని 5 విధములు.

శ్లో॥ అహోరాత్రే సతతకో ద్వౌకాలావనువర్తతే।
అన్యేద్యుష్కస్త్వహోరాత్ర ఏకకాలం ప్రవర్తతే।
తృతీయకస్తృతీయేహ్నిచతుర్థే హ్నిచతుర్థకః॥

7, 8, 12, దినముల వఱకెడతెగక యహోరాత్రములం కలిగియుండునది సంతతజ్వరమని పేరు. పగటియందు జ్వరము వ్యాపించి సాయంకాలమున శమించి మరల రాత్రియందు జ్వరవేగము జూపునది సతతకజ్వరమనియు, రాత్రియందైనను పగటియందైనను ఒకకాలమున వ్యాపించునది అన్యేద్యుష్కజ్వరమనియు, జ్వరవేగముకలిగిన మూడవనాడు మరలవ్యాపించునది తృతీయకజ్వరమనియు, జ్వరవేగముకలిగిన దినమునకు నాలుగవనాడు వ్యాపించునది చతుర్థకజ్వరమనియు భావము. ఇట్లువిడచివిడచి జ్వరమేలకలుగవలెననిన, సతతకజ్వరములో ఆమాశయమందుండు దోషము రాత్రి ప్రథమ కాలమందును, పగటి ప్రథమకాలమందును కఫముచే ప్రకోపమునొంది, పగటియందొక కాలమును, రాత్రియందొక కాలమును, జ్వరమును కలిగించును. దోషము కఫస్థానమైన హృదయమునుండి ఒక్క అహోరాత్రమునకు ఆమాశయమునొంది అన్యేద్యుష్కజ్వరము కలిగించును. కనుకనీ జ్వరము దినమునకొక్కసారి వ్యాపించును. కఫస్థానమైన కంఠమునుండు దోషము ఒక అహోరాత్రమునకు హృదయస్థానమునను, రెండవయహోరాత్రమునకు ఆమాశయంబునను వ్యాపించి జ్వరమువేగ దినమునకుమూడవ

దినము తృతీయక జ్వరమును కలిగించును. కఫస్థానంబైన శిరస్సునందు దోషము ఒక అహోరాత్రమునకు కంఠమందును రెండవ యహోరాత్రమున హృదయమునందును, మూడవయహోరాత్రమున అమాశయమునందును వ్యాపించి జ్వరవేగ దినము మొదలు నాల్గవదినమున చతుర్థక జ్వరముకలిగించును. ఇటులనే సతత, అన్యేద్యుష్క, తృతీయక, చతుర్థక విపర్యయంబులు కూడ నూహించునది. ప్రాతఃకాలమందును రాత్రిప్రథమకాలమందును జ్వరము లేకుండితక్కిన కాలమందెల్ల వ్యాపించుజ్వరము సతతకవిపర్యయంబనియు, రాత్రియందైనను పగటియందైనను ఒక కాలమున జ్వరము లేకుండి తక్కిన కాలములయందు వ్యాపించు జ్వరము అన్యేద్యుష్కవి పర్యయంబనియు, నడుమనొక దినము వ్యాపించి ఆద్యంత దినములయందు జ్వరమువ్యాపించకున్నచో తృతీయక విపర్యయంబనియు, మొదటనొక దినము జ్వరము లేకుండి పిదప రెండు దినములు జ్వరవేగము చూపి పిమ్మటనొక దినము జ్వరము లేకుండునది చతుర్థక విపర్యయమనియు దోషముల యొక్క స్థానభేదములచే జ్వరము యొక్క విపర్యయము తెలియునది. ఇదియుగాక జ్వరములలో ఏకదోషజమనియు, ద్వంద్వజమనియు, సన్నిపాతమనియు, వాతబలాస

కమనియు, ప్రలేపకమనియు, రస, రక్త, మాంస, మేధో, అస్థి మజ్జ, శుక్రగతములనియు, నానావిధభేదములున్నవి. వీటినన్నిటిని వైద్యులగువారు చక్కఁగ గుర్తెరిగి చికిత్సలు చేయుటచేనవి నిస్సంశయముగ బోవుచుండుట వలన నీయాయు ర్వేదమతమే అనుభవ సిద్ధంబుగ నుండునదియని దృఢముగా చెప్పవచ్చును. సామాన్యముగా చలిపట్టివచ్చు జ్వరములన్నియు పైజెప్పినవిషమ జ్వరభేదములనియే యెఱుంగునది.

అధ్యాయము 3

## FLASH THE THIRD.

తృతీయాలోచన.

శాస్త్రవిషయిక అభిప్రాయములు, చికిత్సా సంప్రదాయములు మొదలగునవి విడచి యీచలిజ్వరముల విషయమై కేవల మనఅనుభవములోనుండు అంశములగురించి మాత్రము యోచించి చూచెదము. శికింద్రాబాదు పురమందు 1916వ సం॥ సెప్టంబరునెల ఆఖయిరులో రెండవతూరి ప్లేగుప్రారంభించినందువలన అక్టోబరునెల మధ్యమున ఊరంతయు చాలాభాగము విడువబడినది. అనేకులు పురసరిహద్దులలో కాంపులు

వేసుకొని నివసించుచు అచ్చటచ్చట ప్లేగుకనుబడినప్పుడు వేరొకచోటికిపోవుచు యీప్రకారము తగినవసతులు లేక కష్టపడుచుంటిరిగాని శరీరసంబంధమైన వ్యాధులచే విశేషముగ పీడింపబడలేదు. 1917వ సంవత్సరము ఫిబ్రవరి 15వ తారీఖునుండి మరలజనులు ప్లేగు లేనందున పురప్రవేశము చేయనారంభించిరి. ఫిబ్రవరి ఆఖరులో శికింద్రాబాదంతయు పురజనులచేనిండి యథాప్రకారము లక్ష్మీనివాస యోగ్యమైన నగరంబువోలె శోభిల్లుచుండెను. తమతమ స్వగృహంబులు సజీవులమై చేరితిమని సంతసిల్లుచుంతలో ప్లేగుకంటెను జనులనధికముగ బాధించువ్యాధి జనులరాకడకై నిరీక్షించుచుండెనన్నటుల పెనుభూతము భంగి పురమునావరించి ప్రతియింటను అనారోగ్యము కలిగించి జ్వరబాధలహెచ్చించి ఒకరినొకరి విచారించునంతటి స్థితిలో లేకుండజేసెను. అనగా ప్రతియొక్కరును జ్వరముల చేత బాధపడుచు, ఔషధసేవనచే తగ్గుటయు మరల వచ్చుటయు యీప్రకారము 1917వ సం॥ జూన్ మధ్యభాగమువరకు జ్వరములు ప్రబలియుండి తదనంతరము కొంతఉపశమించినటుల మాఔషధాలయపు రికార్డులవలన స్పష్టమగుచున్నది. 1917వ సం॥ మార్చి 24వ తారీఖునుండి జూన్ 24వ తారీఖు

లోగా సుమారు 5000 చలిజ్వరములచే పీడింపబడినవాండ్రు మావద్ద చికిత్సనొంది గుణపడియున్నారు. ఇందరికి గుణముచేసిన యనుభవముచేత యీచలిజ్వరముల విషయమైమేమాలోచించిన యభిప్రాయములు, తీర్మానములు, చికిత్సాక్రమములు, అనుభవసిద్ధములగుటచే జనుల అంగీకారమునకు పాత్రములగునని మేముప్రచురింపదలంచితిమి.

## చలిజ్వరములకు కారణములు.

ఇదివరకెప్పుడు లేని చలిజ్వరములు పురప్రవేశమైన వెంటనే జనులనీరీతిగనేల బాధించవలెనని ప్రతిమనుజుడును తమకుతాము ప్రశ్నజేయుచుండుట గాక నిర్విషయమైన జ్ఞానముకల వైద్యోత్తముల నొక్కరిని అడుగుచున్నారు. కాని ఎవరెన్ని విధములుగ చెప్పినను, ఒకరికి తప్పినమరొకరికి జ్వరమువచ్చుచుండుటవలనను, ఒకతూరివచ్చి నిలిచిపోక మరలమరల వచ్చుచుండుటవలనను, ఏహేతువు మనసుకుపట్టక జనులు బాధపడుచుండుటమాత్రము తెలియవచ్చుచున్నది. అయినను ఎవరెవ్వరే యే విధమైనహేతువులు కనుగొన్నది, ఆహేతువులు సరియైనవిగాని విచక్కగ విమర్శించి చూచెదము.

ప్లేగుకొంత ఉపశమించిన వెంటనే చలిజ్వరము వచ్చుటచే శికింద్రాబాదునందు భూమిలోపల నుండు నల్లాగొట్టములు నీళ్లు ప్రవహింపక పోవుటచే చిలుముపట్టిమరల పునప్రవేశమైన వెంట నేనీళ్లు విడువబడినందున, ఆచిలుము సంబంధమైననీళ్లు త్రాగుట చేజ్వరములు సంభవించినవని ముందముందు జనులు నుకొను చుండిరి. అయినఆనీళ్లుత్రాగిన చిలుమువాసనతో కూడియుండు నటుల నెవ్వరికిని తెలియలేదు. ఇవియుగాక నీళ్లుప్రవహింప జేసి ఒకమాసము వెనుకకూడ జ్వరములుండుటచేతను, భావుల లోని నీళ్లుత్రాగుచుండు కొందరు మార్వాడిజాతివారి కనేకు లకు జ్వరము వచ్చియుండుటచేతను యీజ్వరములకు హేతు వు నల్లాగొట్టములలో ప్రవహించు ఉదకపానము కాదని తెలి యవచ్చుచున్నది.

మరికొందరు యీజ్వరములకు కారణము ప్లేగుకాల మందుచేసిన ఇంజక్షన్ (ప్లేగురాకుండునటుల వేయుబడిన టీ కాలు) అనిచెప్పుచున్నారు. 1916వసం॥ సెప్టంబరు, అక్టోబరు మాసములలో 100కి80మంది టీకాలువేయించుకొనియుందురు. ఆటీకాలు ప్లేగుసంబంధమైన పురువులసారముతో చేయుబడిన

దైనను, ఆసారము దేహములోనుండువరకును ప్లేగుక్రిములను రాకుండ జేయునను అభిప్రాయముతో అనేకులు టీకాలువే యించుకొనియున్నారు. గాని, టీకాలు వేయించుకొన్నవారలు కూడ ప్లేగుచే మృతినొందిరి. దీనినిబట్టి టీకాలువేయించుకొ నుటచేతనే ప్లేగురానేరదను అభిమానాంశమును అనుభవము లో విరుద్ధమైనను టీకాలువేయించుకొన్నవార్లకందరికిని ప్లేగు కుతరువాత జ్వరములు సంభవించినదను మాటమాత్రము ప్ర త్యక్షవిరోధముగనున్నది. ఈసందేహము నివారించుటకు, ఎం దరు టీకాలు వేయించుకొన్నారు? టీకాలువేయించుకొననివా రికి జ్వరమురాకున్నవా? వేయించుకొనని వారిసంఖ్యకంటె, వే యించుకొన్నవారి కెక్కుడుగ జ్వరములువచ్చినవా? అనునీవిష యములగూర్చి సరియైనసాక్ష్యమిచ్చురిజిస్టరు, లెఖ్ఖలువగైరా లుండినగాని యీహేతువు యుక్తాయుక్తమని చెప్పనలవికా దు. ఇదియుగాక 5, 6, సంవత్సరములక్రిందట యిదేశికింద్రా బాదునందు ప్లేగు సంభవించినప్పుడు జనులుటీకాలువేసుకొ న్నను ప్లేగుకు తరువాత చలిజ్వరము లిట్లుప్రబలియుండకుండు టచే యీహేతువునే మాత్రము నంగీకరింప నలవిగాకున్నది. గాని టీకాలలో పూర్వపురసమునకును, యిప్పటిరసమునకును

భేదముండునని వాదించినవార్లకు మాత్రము సరియైన ఉత్తర
ము చెప్పనలవికాదు. కావుననే యీసందేహము నివారించు
టకు సరియైన లెఖ్ఖలుండవలెను.

పాశ్చాత్య వైద్యశాస్త్రజ్ఞులును, ఆంగ్లేయవిద్యావంతు
లును యీచలిజ్వరములు ప్రథమాలోచనలో చెప్పినప్రకా
రము చీగటీగలు లేక దోమలవలన కలిగినవనియ్నుచున్నారు.
ప్లేగుకాలమందు ఊరిలోని భావులు, చెరువులు, మొద
లగువాటిలోని జలము వాడబడకుండుటచేతను, మయిల కా
లువలోని జలము అక్కడక్కడనిలచి ప్రవహింపకపోవుటచే
తను చీగటీగలుప్రబలి అవియాకల్మష జలములపై సంచరిం
చుటచే వాటిలోపల పిల్లమలేరియా పురువులనేకములుచేరి
దోమలు మనలను కరచినప్పుడు మననెత్తురిలో ఆమలేరియా
పురువులు ప్రవేశించి మలేరియాజ్వరములను కలుగజేయును.
ఈహేతువు సత్యమైనదికానిది యీక్రింది ప్రశ్నలకుత్తరవాసం
గిన తెలియగలదు.

1. పూర్వమెప్పుడైనను మనదేశములో అపరిశుద్ధజలము
లుగలభావులు, కుంటలు, చెరువులుకలవా?

2. అట్టి జలాశయములుండుటచే దోమలు ప్రబలివాటి కాటుచేజ్వరములెప్పుడైనను కలుగుచుండినవా?

3. దోమలున్నచోట వాటిచే కరువబడకుండు మనుజులు కలరా?

4. దోమలబాధ నివారింపజేయుటకై ఎప్పటికిని పరదా వేసుకొని సంచరించు వారలున్నారా? అట్టివారెవరైనను ఉన్నచో వారికి జ్వరము రాకున్నదా?

5. దోమలు లేని ప్రదేశము ఇండియాలో కలదా? దోమలున్నచోట వసించువారందరు జ్వరపీడితులైయున్నారా?

6. ఈమలేరియా జ్వరములపై వాడబడు "క్వైనా" (Quinine) అను ఔషధరాజము సేవించువారందరును జ్వరవిముక్తులైయున్నారా? మలేరియాకు దివ్యౌషధమగు "క్వైనా" మూడుపైలుకు 10 గ్రేనులు దొరకుచుండ చలిజ్వరములింత ప్రబలముగా నేలయుండవలెను?

7. మూఢతనముచేతను, అజ్ఞానముచేతను క్వైనాఉపయోగింపని వారందరికిని చలిజ్వరములు వచ్చుచున్నవా? విద్యావంతు

లును, జ్ఞానసంపన్నులగువారు క్వైనాను సేవించుటచే జ్వరములు రాకున్నవా?

8. "దోమలలో అన్నిజాతులును మలేరియాను కలుగజేయదు. అనాఫోలీసు జాతియందలి ఆడుదిమాత్రమే మలేరియా పురుగును చేరవేయును. కాన దానికాటుచే చలిజ్వరములు కలుగుచున్నవి," అని చెప్పినచో ఆజాతిదోమలందరిని బాధించునా? లేక మానవజాతిలో కొందరినిమాత్రము బాధించునా? ఆజాతిదోమలు ఒకకాలములోనుండి వేరొక్కకాలములో నుండకపోవునా? లేక అన్నికాలములలోనుండునా?

ఈపై ప్రశ్నలకు సమాధాన మొసగినకాని యీజ్వరములు దోమలకాటుచే వచ్చుమలేరియా జ్వరములని నమ్మజాలకున్నారము. మాయనుభవములో సృష్టిలోనొకజీవమగుదోమలను నిర్మూలముగ నాశమొందించు ఉపాయమేదియు లేదనియు, ఎప్పటికినుండు దోమలబాధచేతనే చలిజ్వరములోకానొకప్పుడువిస్తారముగ వ్యాపించ నేరదనియు,తచ్ఛమనార్థమై "క్వైనా" సేవించువారెల్లప్పుడు నారోగ్యమనుభవింప లేదనియు కనుగొనియున్నారము. ఈవిషయము శోధనీయమగు విషయము.

విపులమైన శోధనాద్యాధారములవల్లనే నమ్మవలసినదిగను న్నది. తగిన ఆధారములు లేకుండుటంబట్టి యీహేతువుయొక్క సత్యాసత్యము నిర్ణయింప జాలకున్నారము.

ఇటీవలకొందరు మెసపొటోమియాలోనుండి సైనుకులీగ్రామమందు చేరుటచే ఆదేశమునుండి వచ్చినవారలను మలేరియా కలిగించుదోమలు కరచి పిదప మనలనుకరచుటచేత వారికున్న మలేరియాజ్వరము గ్రామస్థులకు వ్యాపించినదని అనుకొనుచున్నారు. ఇటులైనచో, మలేరియా జ్వరములు అంటువ్యాధులలో చేరవలెనుకదా? పాశ్చాత్యవైద్యశాస్త్రములో చలిజ్వరములు (Malaria Fevers) అంటువ్యాధులు (Contagions) కాదనియు, మలేరియాక్రిములు దేహములోనే వృద్ధిజెంది వ్యాధి కలుగజేయుచుండుటచే క్రిమిజరోగము (Infectious diseases) లలో చేరుచున్నవనియు చెప్పుచుండుటచేత ప్లేగు కలరావలె ఒకరినుండి మరొకరికి ప్రవేశింపదని తెలయుచున్నది. అయితే యీతూరి శికింద్రాబాదునందు కలిగిన చలిజ్వరములు అనుభవములో అంటువ్యాధులవలె (Contagions) ఒకరికివచ్చిన యింటివారందరికి వచ్చుటచూడ యీజ్వరములు మెసపొటోమియా సైనికుల జ్వరముకాని, మలేరియాజాతి జ్వరములు

కాని కాదనియు తెలియగలము. ఇదియుగాక మెసపొటోమి యానైనకుంబ యిప్పటికిని యిచ్చటనే యుండియుకూడ చలి జ్వరములు 1917సం॥ జూన్ తారీఖు అంత్యమునరకు కొంత ఉపశమించి యుండుటచూడ పై వాదమే మాత్రమును యుక్తి యుక్తముగ కనబడదు.

కొందరు దీనివిషయమై దీర్ఘాలోచన చేసి మాతోనీవిధము గనుడివిరి. భూగోళశాస్త్రప్రకారము భూమినుండి సముద్రము మీదుగా వీచువాయువొకటనియు, సముద్రమునుండి భూమి పై వీచువాయువు మరొక్కటనియు వాయువులు రెండువిధ ములు. దీనివలన మనలను ఆవరించి యుండువాయువు ఒకటే విధముగనుండదనియు అచ్చటచ్చటకలుగు కాలభేదములచే వాయువులో శుద్ధాపరిశుద్ధగుణములును, శీతోష్ణాదిభేదములు ను కలుగుననియు తెలియవచ్చుచున్నది. ప్రకృతము ఐరోపా దేశము అనేకయోజనముల పర్యంతము రక్తప్రవాహము లతోను, దుర్గంధయుత శవములతోను నిండియుండుటచే ఆప్రదేశములోని వాయువు అపరిశుద్ధమై మనదేశములోనా వాయువు వీచినప్పుడు ఆరోగ్యమును చెరచి జ్వరములుకలుగ

జేయును. కనుకనే ఇండియాదేశములో అనేకస్థలములయందు చలిజ్వరములు కలుగుచున్నవని చెప్పుచున్నారు. కాని, మూడేండ్లపర్యంతము యుద్ధముజరుగుచుండ యీసంవత్సరములో మాత్ర మీరీతిగ కొన్నికొన్ని స్థలములయందు మాత్రము జ్వరబాధలధికముగా ఉండుటచూడ యీహేతువుకూడ సర్వ జనసమ్మతముగ కానబడదు.

జనసామాన్యులలో ననేకులు హవ (గాలి), పాని (జలము) చెడిపోయినందున నీజ్వరములు కలుగుచున్నవని చాలావరకు వాడుకొనుచున్నారు గాని అటుల చెడిపోవుటకేమి కారణమో చెప్పజాలకున్నారు. గాలిచెడుటవలన దేహారోగ్యము చక్కగనుండదని ఎల్లరకు తెలిసినవిషయమే. శికింద్రాబాదునందు జ్వరబాధచే పీడింపబడుచుండినవారు తత్సమీపగ్రామమగు వికారాబాదు పోయినవెంటనే ఔషధములేకనే గుణపడియున్నారు. మరల శికింద్రాబాదుకు వచ్చినతోడనే మరల జ్వరములుకలిగినవి. అయితే మల్కాజిగిరి, బొల్లారం, అలవాలు, నైజామాబాదు మొదలగు గ్రామములకు వెళ్లినవారు మాత్రము జ్వరబాధలనుండి తొలగించుకొనలేకపోయిరి. ఆరోగ్యస్థలమని చెప్పబడు వికారాబాదునకు పోయినవారలు జ్వరవిము

క్ష్ప్లైలెరి గాని అచ్చటనుండి ప్రతిదినము శికింద్రాబాదుకు పానాదులకు ఉదకము తెప్పించి త్రాగుచున్నవారలకు జ్వరములు వచ్చుచుండినవి. దీనినిబట్టి జలదోషములో భేదములేదని చెప్పవచ్చును. ఇచ్చటనేకాక, మాకు తెలిసినంతవరకు తూర్పున బెజవాడనరకును, బెంగుళూరు, కడప, కర్నూలు, బళ్ళారిజిల్లాలో కొన్నికొన్నిచోట్ల యీసమయములో జ్వరబాధలధికము గనున్నటుల కనబడుచున్నది. చెన్నపట్టణము మొదలగుగొప్ప గొప్పపట్టణములయందుకూడ నీజ్వరములు విస్తారముగనుండ వచ్చునుకాని శికింద్రాబాదునందు కలిగినటుల అంటువ్యాధివలె యితరచోట్లకలిగినటుల తెలియలేదు. వీటినన్నిటినిబట్టి చుట్టునుండువాయువు చెడుటవలన నీజ్వరములు కలిగినవను మాట ఒకహేతువుగా నమ్మవచ్చును కాని ఆవాయువెటుల చెడినది గ్రహింపజాలకున్నారు.

ఆత్రేయ మతప్రకారము జ్వరమునకు ఆహారవిహారములే మూలకారణములని యిదివరకే సూచించియుంటిమి. ఈఆహార విహారముల దోషము జనులకెల్లప్పుడు కలుగుచునేయుండ ప్రకృతకాలమునమాత్ర మీరీతిగజ్వరములేల

ప్రబలియుండవలెను? అనునం దేహము కలుగుచున్నది త్రై మాసిక ఆరోగ్యప్రచురములలో ప్రథమసంచికయందు కొన్ని దోషములు కాలప్రభావముచే, చయ, ప్రకోప, ప్రశమము లు జెందుననియు, ఆదోషగతులనెఱిగి పానాహార విహారముల యందు చక్కగనడుచుకొన్న దేహములెల్లప్పుడు ఆరోగ్యస్థితి యందుండుననియు విశదీకరించియుంటిమి. వాతమును శమిం చుకొఱకు హేమంతశిశిర ఋతువులయందు సేవించు ఆహార విశేషములచే దేహమందు శ్లేష్మము వృద్ధిజెంది జీర్ణకోశము నుజెరచి పైవచ్చు వసంతఋతువందు సూర్యతాపముచే శ్లేష్మముకరగి అనేకములైన కఫజనితవ్యాధులను కలుగజేయు నని శాస్త్రాధారములవలన పూర్వము దెలియజేసి యుంటిమి. హేమంత, శిశిరఋతువులయందు పురజనులందరును గ్రామాంతముల యందును, పురసరిహద్దులలో గుడిశెలు, డేరాలు, మొదలగునవి వేసుకొని చలిగాలికి ఓర్చుకొనియుండినందున వారి దేహమందు శ్లేష్మాభివృద్ధికలిగి వసంతఋతువందు పురప్రవేశమైన పిదప "ఋతు సంధిషువ్యాధిర్జాయతే" అనుశ్రుతి ప్రమాణమునుబట్టి శిశిరవసంతఋతువుల సంధియందు సూర్యతాపముచే శ్లేష్మముకరిగి కఫజనితవ్యాధులనేకములనుకలిగించిన

వి. ఈ హేతువుచూడ అనుభవసిద్ధముగ నేయున్నది. ఏలనన యిప్పుడొచ్చినజ్వరముల యందీలక్షణములు విశేషముగా కనుబడుచున్నది. నోరుజిగట, చేదు, తంద్ర, మోహము, దగ్గు, అరుచి, పలుమారు దాహము, శీతలము మొదలగు లక్షణములు కలిగియుండును. ఇదియుగాక శీతాధిక్యముచే వాతము ప్రబలివాతపైత్య జ్వరములు కూడకలుగుచున్నవి. ఏలనన దప్పి, మూర్ఛ, భ్రమ, సర్వాంగతాపము, నిద్రానాశము, తలనొప్పి కంఠము ముఖము ఎండియుండుట, వాంతి, గగుర్పాటు, అరుచి కండ్లుచీకట్లుకమ్ముట, కీళ్లునొచ్చుట, ఆవలింతలు మొదలగు వాతపైత్య జ్వర లక్షణములుకూడ కనుపడుచున్నవి. ఇదియుగాక జ్వరమందుగాని. జ్వరాంతమందుగాని, సర్ది (శీతల) పదార్థపానాహార సేవనకలిగిన జ్వరము మరలమరల సంభవించుట అనుభవములోచూచి యున్నారము. ఈయనుభవముకూడ శాస్త్రానుసారముగనేయున్నది. చికిత్సాసారసిద్ధ సంగ్రహమందు యీవిధముగజెప్పబడినది.

శ్లో॥ గుర్వన్నంశీతలంవారి దివాస్వాపంక్లమంత్యజేత్।
జ్వరితోజ్వరముక్తశ్చ యత్నాదాబలలాభతః।
అసక్తాహారచేష్టాభిః పునరావర్తతేజ్వరః॥

జ్వరితుడును, జ్వరవిముక్తుడును శరీరమునకు బలము కలుగు వరకును బలకర ఆహారసేవ, శీతోదకపానము, పగటినిద్ర, శ్రమవీనిని వర్జించవలెను. విరుద్ధాహారచేష్టలచే నివృత్తించిన జ్వరము మరలవచ్చును.

ఈపై శాస్త్రాధారమునకును, మనయనుభవమునకును కొంచమైనను, భేదములేకయున్నది. కనుక, యీజ్వరములు పూర్వఋతుదోషమువలన కలిగినవనియు, అపథ్యాహార, శీతోపచారములచే ప్రబలిమరల మరల కలుగుచున్నవనియు చెప్పుటయుక్తికిని, అనుభవమునకును, శాస్త్రమునకును,సమ్మతముగనేయున్నది. మరియు మాయనుభవములో కనుగొన్న చికిత్సాసంప్రదాయములచే మూడునెలలలో 5000 మంది మాచేగుణపడిరి. మాచేకనిపెట్టబడిన మన్యజ్వరహారిమాత్రలు సుమారు ౧ లక్ష వరకు వినియోగించి చూచినారము.

ఈమాత్రలు ౧ తులము అల్లము, ౧ తులము ఒమము, ½ తులముజిలకర్రవీటియొక్క పొంగించిన స్వరసముతో పూటకు రెండు మాత్రలు చొప్పునదిన మునకుమూడు పూటలు యివ్వగామూడు దినములలో యీతూరివచ్చిన జ్వరములన్నియు త

ష్కరిగుణపరచినవి. కావుననే మా ఔషధాలయము యీమూడు మాసములలో ప్రచురమున కధికముగవచ్చినది. ఈయనుభవముచే మేమీక్రింది యంశములు నిర్ధారపరచికొని యున్నారము.

౧. ఈజ్వరములు కడచిన ఋతువులలో సంచితమైన దోషముల వలనకలిగినవి.

౨. జ్వరములు విశేషముగా దోషస్థానములగు శ్వాసకోశములు, ఉదరము, శిరస్సునాశ్రయించి యుండును. కనుకనే దగ్గు, వాంతులు, తలనొప్పి, నిద్రలేకుండుట, కడుపునొప్పి, మలబద్ధకము, మొదలగునవి కలుగుచుండును.

౩. ఈజ్వరములు హేతువ్యాధి విపరీతములగు పానాహారవిహార ఔషధసేవనచే గుణపడును.

౪. జ్వరాంతమందు పథ్యాహార సేవనచేతనే మరల మరల రాకుండును. అపథ్యాహార సేవనచే రక్తహీనము, నంజు, జ్వరగడ్డ మొదలగునవి కలుగును.

౫. ఈచలిజ్వరములు ఆయుర్వేదమందు చెప్పబడినవన స్పతి ఔషధాదులచే తప్పక గుణపడును.

౬. ఋతుచర్యవిధానములు కనుగొని ఆచరించువారికి జ్వరములు రానేరవు. ఇదివరకే యీవిషయము శోధనీయమైనవిషయమని చెప్పియుంటిమి. కనుక వైద్యాభిమానులందరును తమతమయనుభవములు ప్రచురించిన సర్వజనోపయుక్తముగనుండుననినమ్ముచున్నాము.

---

## అధ్యాయము ౪.

# జ్వరహరచికిత్సలు.

---

ఈచలిజ్వరముల విషయమై మాకనుభవములోనున్న కొన్ని యోగములు, వైద్యులసహాయము దొరకకుండునప్పుడు ప్రతియింట నుపయోగించుటకై క్రిందవివరింపబడినవి.

1. జ్వరాదియందు మలబద్ధకమున్నచో— యోగము ౧ నుండి ౫ వరకేదియేని ప్రయోగింపవచ్చును.

2. జ్వరమున్నప్పుడు— యో॥ ౬, ౭, ౮, ౧౦, ౨౧. మరియు యో॥ ౧౫తో యో॥ ౧౪ సేవింపవచ్చును.

3. జ్వరము విడిచినపిమ్మట—యో॥ ౧౪ను, యో॥ ౮, లేక౧౦తో సేవింపవలెను. ఇటులజ్వరము విడిచినను ౭, ౮ దినములవరకు సేవింపవలెను.

4. పిత్తజన్యవ్యాధులయందు—యో॥ ౯, ౧౭, ౧3.

5. శ్వాససంబంధమైన జ్వరములయందు—యో॥ ౧౧ ను యో॥ ౧౭తో సేవించవలెను.

6. వాంతులున్నచో—యో॥ ౧౭ తేనతోపుచ్చుకొనవలెను. లేక యో॥ ౧౮ ఒకటిరెండు మాషములెత్తు సేవించవలెను.

7. చీము రక్తవిరేచనములు గాని లేక విరేచనములు గాని ఉన్నచో—యో॥ ౧౯ నీళ్లతో పుచ్చుకొనవలెను.

8. జ్వరాంతమందు దుర్బలత్వమునకు—యో॥ ౨౦ని యో॥ ౮, ౯, ౧౦ వీటిలో దేనితోనైనను పుచ్చుకొనవలెను.

9. కడుపునొప్పి, అజీర్ణమున్నచో--యో॥ ౧౬ను యో॥ ౧3 కలిపి పుచ్చుకొనవలెను.

జేయును. కనుకనే ఇండియాదేశములో అనేకస్థలములయందు చలిజ్వరములు కలుగుచున్నవని చెప్పుచున్నారు. కాని, మూడేండ్లపర్యంతము యుద్ధముజరుగుచుండ యీసంవత్సరములో మాత్ర మీరీతిగ కొన్నికొన్ని స్థలములయందు మాత్రము జ్వరబాధలధికముగా ఉండుటచూడ యీహేతువుకూడ సర్వజనసమ్మతముగ కానబడదు.

జనసామాన్యులలో ననేకులు హావ (గాలి), పాని (జలము) చెడిపోయినందున నీజ్వరములు కలుగుచున్నవని చాలావరకు వాడుకొనుచున్నారు గాని అటులచెడిపోవుటకేమి కారణమో చెప్పజాలకున్నారు. గాలిచెడుటవలన దేహారోగ్యము చక్కగనుండదని ఎల్లరకు తెలిసినవిషయమే. శికింద్రాబాదునందు జ్వరబాధచే పీడింపబడుచుండినవారు తత్సమీపగ్రామమగు వికారాబాదు పోయినవెంటనే ఔషధములేకనే గుణపడియున్నారు. మరల శికింద్రాబాదుకు వచ్చినతోడనే మరలజ్వరములుకలిగినవి. అయితే మల్కాజిగిరి, బొల్లారం, అలవాలు, నైజామాబాదు మొదలగు గ్రామములకు వెళ్లినవారు మాత్రము జ్వరబాధలనుండి తొలగించుకొనలేకపోయిరి. ఆరోగ్యస్థలమని చెప్పబడు వికారాబాదునకు పోయినవారలు జ్వరవిము

క్షుల్లెరి గాని అచ్చటనుండి ప్రతిదినము శికింద్రాబాదుకు పానాదులకు ఉదకము తెప్పించి త్రాగుచున్నవారలకు జ్వరములు వచ్చుచుండినవి. దీనినిబట్టి జలదోషములో భేదములేదని చెప్పవచ్చును. ఇచ్చటనేకాక, మాకు తెలిసినంతవరకు తూర్పున బెజవాడవరకును, బెంగుళూరు, కడప, కర్నూలు, బళ్ళారిజిల్లాలో కొన్నికొన్నిచోట్ల యీసమయములో జ్వరబాధలధికము గనున్నటుల కనబడుచున్నది. చెన్నపట్టణము మొదలగుగొప్ప గొప్పపట్టణములయందుకూడ నీజ్వరములు విస్తారముగనుండవచ్చునుకాని శికింద్రాబాదునందు కలిగినటుల అంటువ్యాధివలె యితరచోట్లకలిగినటుల తెలియలేదు. వీటినన్నిటినిబట్టి చుట్టునుండువాయువు చెడుటవలన నీజ్వరములు కలిగినవను మాట ఒకహేతువుగా నమ్మవచ్చును కాని ఆవాయువెటుల చెడినది గ్రహింపజాలకున్నారు.

ఆత్రేయ మతప్రకారము జ్వరమునకు ఆహారవిహారములే మూలకారణములని యిదివరకే సూచించియుంటిమి. ఈఆహార విహారముల దోషము జనులకెల్లప్పుడు కలుగుచునేయుండ ప్రకృతకాలమునమాత్ర మీరీతిగజ్వరములేల

ప్రబలియుండవలెను? అనుసందేహము కలుగుచున్నది. త్రై మాసిక ఆరోగ్యప్రచురములలో ప్రథమసంచికయందు కొన్ని దోషములు కాలప్రభావముచే, చయ, ప్రకోప, ప్రశమము లు జెందుననియు, ఆదోషగతులనెఱిగి పానాహార విహారముల యందు చక్కగనడుచుకొన్న దేహము లెల్లప్పుడు ఆరోగ్యస్థితి యందుండుననియు విశదీకరించియుంటిమి. వాతమును శమిం చుకొఱకు హేమంతశిశిర ఋతువులయందు సేవించు ఆహార విశేషములచే దేహమందు శ్లేష్మము వృద్ధిజెంది జీర్ణకోశము నుజేరచి పైవచ్చు వసంతఋతువందు సూర్యతాపముచే శ్లే ష్మముకరగి అనేకములైన కఫజనితవ్యాధులను కలుగజేయు నని శాస్త్రాధారములవలన పూర్వము దెలియజేసి యుంటిమి. హేమంత, శిశిరఋతువులయందు పురజనులందరును గ్రామాం తములయందును, పురసరిహద్దులలో గుడిశెలు, డేరాలు, మొదలగునవి వేసుకొని చలిగాలికి ఓర్చుకొనియుండినందున వా రిదేహమందు శ్లేష్మాభివృద్ధికలిగి వసంతఋతువందు పురప్రవే శమైన పిదప "ఋతు సంధిషువ్యాధిర్జాయతే" అనుశ్రుతి ప్ర మాణమునుబట్టి శిశిరవసంతఋతువుల సంధియందు సూర్యతా పముచే శ్లేష్మముకరిగి కఫజనితవ్యాధులనేకములనుకలిగించిన

౩. ఈహేతువుచూడ అనుభవసిద్ధముగ నేయున్నది. ఏలనన యిపు డొచ్చినజ్వరముల యందీలక్షణములు విశేషముగా కనుబడు చున్నది. నోరుజిగట, చేదు, తంద్ర, మోహము,దగ్గు, అరుచి, పలుమారు దాహము, శీతలము మొదలగు లక్షణములు కలిగియుండును. ఇదియుగాక శీతాధిక్యముచే వాతముప్ర బలివాతపైత్య జ్వరములు కూడకలుగుచున్నవి. ఏలనన దప్పి, మూర్ఛ, భ్రమ, సర్వాంగతాపము, నిద్రానాశము, తలనొప్పి కంఠము ముఖము ఎండియుండుట, వాంతి, గగుర్పాటు, అరుచి కండ్లుచీకట్లుకమ్ముట, కీళ్లునొచ్చుట, ఆవలింతలు మొదలగు వాతపైత్య జ్వరలక్షణములుకూడ కనుపడుచున్నవి. ఇదియుగాక జ్వరమందుగాని, జ్వరాంతమందుగాని, సర్ది (శీతల) పదార్థపానాహార సేవకలిగిన జ్వరము మరలమరల సంభవించుట అనుభవములోచూచి యున్నారము. ఈయనుభవముకూడ శాస్త్రాను సారముగ నేయున్నది. చికిత్సాసారసిద్ధ సంగ్రహమందు యీ విధముగ జెప్పబడినది.

శ్లో॥ గుర్వన్నంశీతలంవారి దివాస్వాపంక్లమంత్యజేత్।
జ్వరితోజ్వరముక్తశ్చ యత్నాదాబలలాభతః।
అసత్మాహారచేష్టాభిః పునరావర్తతేజ్వరః॥

జ్వరితుడును, జ్వరవిముక్తుడును శరీరమునకు బలము కలుగు వరకును బలకర ఆహారసేవ, శీతోదకపానము, పగటినిద్ర, శ్రమవీనిని వర్జించవలెను. విరుద్ధాహారచేష్టలచే నివృత్తించిన జ్వరము మరలవచ్చును.

ఈపై శాస్త్రాధారమునకును, మనయనుభవమునకును కొంచమైనను భేదములేకయున్నది. కనుక, యీజ్వరములు పూర్వ ఋతుదోషమువలన కలిగినవనియు, అపథ్యాహార, శీతోపచారములచే ప్రబలిమరల మరల కలుగుచున్నవనియు చెప్పుట యుక్తికిని, అనుభవమునకును, శాస్త్రమునకును, సమ్మతముగనే యున్నది. మరియు మా యనుభవములో కనుగొన్న చికిత్సాసంప్రదాయములచే మూడునెలలలో 5000 మంది మాచేగుణపడిరి. మాచేకనిపెట్టబడిన మన్యజ్వరహారిమాత్రలు సుమారు ౧ లక్ష వరకు వినియోగించి చూచినారము.

ఈమాత్రలు ౧ తులము అల్లము, ౧ తులము ఓమము, ½ తులముజిలకర్రవీటియొక్క పొంగించిన స్వరసముతో పూటకు రెండు మాత్రలు చొప్పునదిన మునకుమూడు పూటలు యివ్వగామూడు దినములలో యీతూరివచ్చిన జ్వరములన్నియు త

ప్పక గుణపరచినవి. కావుననే మా ఔషధాలయము యీమూ డు మాసములలో ప్రచురమున కధికముగవచ్చినది. ఈయను భవముచే మేమీ క్రింది యంశములు నిర్ధారపరచికొని యు న్నారము.

౧. ఈజ్వరములు కడచిన ఋతువులలో సంచితమైన దోషముల వలనకలిగినవి.

౨. జ్వరములు విశేషముగా దోషస్థానములగు శ్వాస కోశములు, ఉదరము, శిరస్సునాశ్రయించి యుండును. కను కనే దగ్గు, వాంతులు, తలనొప్పి, నిద్ర లేకుండుట, కడుపునొ ప్పి, మలబద్ధకము, మొదలగునవి కలుగుచుండును.

3. ఈజ్వరములు హేతువ్యాధి విపరీతములగు పానాహా రవిహార ఔషధసేవనచే గుణపడును.

ర. జ్వరాంతమందు పథ్యాహార సేవనచేతనే మరల మ రల రాకుండును. అపథ్యాహార సేవనచే రక్తహీనము, నంజు, జ్వరగడ్డ మొదలగునవి కలుగును.

౫. ఈచలిజ్వరములు ఆయుర్వేదమందు చెప్పబడినవనస్పతి ఔషధాదులచే తప్పక గుణపడును.

౬. ఋతుచర్యవిధానములు కనుగొని ఆచరించువారికి జ్వరములు రానేరవు. ఇదివరకే యీవిషయము శోధనీయమైనవిషయమని చెప్పియుంటిమి. కనుక వైద్యాభిమానులందరును తమతమయనుభవములు ప్రచురించిన సర్వజనోపయుక్తముగనుండుననినమ్ముచున్నాము.

---

అధ్యాయము ౪.

## జ్వరహారచికిత్సలు.

---

ఈచలిజ్వరముల విషయమై మాకనుభవములోనున్న కొన్ని యోగములు, వైద్యులసహాయము దొరకకుండునప్పుడు ప్రతియింట నుపయోగించుటకై క్రిందవివరింపబడినవి.

1. జ్వరాదియందు మలబద్ధకమున్నచో— యోగము ౧ నుండి ౫ వరకేదియైన ప్రయోగింపవచ్చును.

2. జ్వరమున్నప్పుడు— యో॥ ౬, ౭, ౮, ౧౦, ౨౧. మరియు యో॥ ౧౫తో యో॥ ౧౪ సేవింపవచ్చును.

3. జ్వరము విడిచినపిమ్మట— యో॥ ౧౪ను, యో॥ ౮, లేక ౧౦తో సేవింపవలెను. ఇటుల జ్వరము విడిచినను ౭, ౮ దినములవరకు సేవింపవలెను.

4. పిత్తజన్యవ్యాధులయందు— యో॥ ౯, ౧౭, ౧౩.

5. శ్వాససంబంధమైన జ్వరములయందు— యో॥ ౧౧ను యో॥ ౧౭తో సేవించవలెను.

6. వాంతులున్నచో— యో॥ ౧౭ తేనతో పుచ్చుకొనవలెను. లేక యో॥ ౧౮ ఒకటి రెండు మాషములెత్తు సేవించవలెను.

7. [illegible]యు రక్త విరేచనములు గాని లేక విరేచనములు గాని ఉన్నచో— యో॥ ౧౯ నీళ్లతో పుచ్చుకొనవలెను.

8. జ్వరాంతమందు దుర్బలత్వమునకు— యో॥ ౨౧ని యో॥ ౮, ౯, ౧౦ వీటిలో దేనితోనైనను పుచ్చుకొనవలెను.

9. కడుపునొప్పి, అజీర్ణమున్నచో— యో॥ ౧౬ను యో॥ ౧౩ కలిపి పుచ్చుకొనవలెను.

# చికిత్సా యోగములు.

---

## విరేచనౌషధములు.

సుఖవిరేచన చూర్ణము—సీసా 20 పూటలమందు రూ॥ 1

| | |
|---|---|
| అతిమధురము<br>శతపుష్పి<br>మార్కండి<br>గంధకము | సమభాగములు కలుపవలెను. మోతాదు ¼-1 తులము రాత్రిపరుండబోవునప్పుడు కాచిన ఆవుపాలతో పుచ్చుకొనవలెను. ఉదయము 1, 2 విరేచనములగును. |

---

2 ఇచ్ఛాభేదిరసము—నూటికి రూ॥ 1

| | | | |
|---|---|---|---|
| రసశింధూరము | 1 | తు॥ | నిమ్మకాయరసముతోనూరి 1 గుంజెత్తుమాత్రలు కట్టవలెను. మో 1-3 ఉదయము నీళ్లతోపుచ్చుకొనిన ఆమాంతము విరేచనమగును. చారుఅన్నముగాని మజ్జిగఅన్నముగాని పుచ్చుకొనిన విరేచనములు నిలుచును. |
| టంకణము | 1 | ,, | |
| శుంఠి | ¼ | ,, | |
| పిప్పిలి | ¼ | ,, | |
| హేమక్షీరి | 1 | ,, | |
| దంతివిత్తులు | ½ | ,, | |

---

3 త్రైలబిందు—సీసా 0-8-0

| | | |
|---|---|---|
| ఆముదము | 3 తు॥ | గాఢవిరేచనములగును. పిల్లలకు 1-3 చుక్కలు. పెద్దవాండ్లకు 6-7 ,, తేనలోగాని కాఫిలోగా[illegible]దయంపుచ్చుకొనేది. మజ్జిగఅన్న[illegible]తినిన విరేచనములు నిలుచును. |
| సొనాముఖి | 1 ,, | |
| తెగడ | 1 ,, | |
| స్నుహీక్షీరము | ½ ,, | |

---

4 ఈనోసుఫ్రూట్ సాల్టు—సీసా రూ॥ 3-8-0

¼ నుండి ½ తులములవరకు నీళ్లలోవేసి పొంగువచ్చుచుండగా త్రాగేది. 1, 2 విరేచనములగును.

5 సాముద్రిక విరేచనచూర్ణము

| | |
|---|---|
| సోడియంసల్ఫేటు | మో॥ ¼ ఔన్సునుండి ½ ఔన్సువరకు. |
| సోడియంకార్బొనేటు | |

క్వాథములు లేక కషాయదినుసులు.

కషాయక్రమము—కషాయదినుసులు 2 తులములు,
నీళ్లు 32 ,,

చక్కగా ¼ భాగము ఇగురువరకు కాచవలెను.

మోతాదు పిల్లలకు ¼-½ ఔన్సు
పెద్దవాండ్లకు 1-2 ఔన్సులు.

(కషాయములు ప్రతిదినము నూతనముగ చేయవలెను. కషాయదినుసులన్నియు మా వద్దవిక్రయింపబడును. వెల ప్యాకెటుకు 0-2-0)

---

6 పర్పటక్వాథము.

| | |
|---|---|
| పర్పాటకము<br>ధాన్యకము<br>అతిమధురము<br>ద్రాక్ష | సమభాగములు. పైత్యజ్వరములలో చాలాఉపయోగము. |

---

7 సప్తపర్ణక్వాథము.

| | | | |
|---|---|---|---|
| సప్తపర్ణ | 1 | తు॥ | మన్యపుజ్వరములలో చాలాఉపయోగము. వాతపైత్యముల నణచును. |
| గుడూచి | 1 | ,, | |
| శుంఠి | ½ | ,, | |

---

8 గుడూచ్యాది క్వాథము.

| | | | |
|---|---|---|---|
| గుడూచి | 1 | తు॥ | డిటో |
| సప్తపర్ణ | 1 | ,, | |
| కిరాట | 1 | ,, | |
| శుంఠి | ½ | ,, | |

9 నింబాదిక్వాథము.

| | | | |
|---|---|---|---|
| వేపచెక్క | ... | $\frac{1}{4}$ | తు॥ |
| పర్పాటకము | ... | 1 | ,, |
| పాఠ | ... | $\frac{1}{2}$ | ,, |
| కటుకరోహిణి | ... | $\frac{1}{4}$ | ,, |
| హారీతకి | ... | $\frac{1}{2}$ | ,, |
| అడ్డసరపువేరు | ... | $\frac{1}{2}$ | ,, |
| వాలకము | ... | $\frac{1}{2}$ | ,, |
| ధన్వయాస | ... | $\frac{1}{2}$ | ,, |

పిత్తకోశసంబంధమైన వ్యాధులలోను, కామిలమొదల గు వ్యాధులలోను, జ్వరములలోను ఉపయోగింపవలెను.

---

10 అమృతాదిక్వాథము

| | | | |
|---|---|---|---|
| గుడూచి | ... | 1 | తు॥ |
| తుంగముస్తలు | ... | 1 | ,, |
| కిరాట | ... | 1 | ,, |
| శుంఠి | ... | $\frac{1}{4}$ | ,, |

అజీర్ణవాతములోను, పైత్యజ్వరములలోను చాలాఉపయోగము.

## 11 అర్కాదిక్వాథము.

| | | | |
|---|---|---|---|
| అర్కమూల | ... | ½ | తు॥ |
| జీలకర్ర | ... | ½ | " |
| త్రికటు | ... | 1 | " |
| కంటకారి | ... | 1 | " |
| కర్కాటశృంగి | ... | ½ | " |
| కోష్ఠము | ... | ½ | " |

ఆమవాత జ్వరములలోను, శ్వాససంబంధమైన జ్వరములలోను ఉపయోగింపవలెను.

---

## 12 కళింగకాదిక్వాథము

| | | | |
|---|---|---|---|
| ఇంద్రయవ | ... | 1 | తు॥ |
| పటోల | ... | 1 | " |
| కటుకి | ... | ¼ | " |

జ్వరమును హరించును, పైత్యజ్వరములలో చాలా ఉపయోగించును.

13 పటోలాది క్వాథము

| | | | |
|---|---|---|---|
| పటోల | ... | 1 | తు॥ |
| త్రిఫల | ... | 1 | ,, |
| త్రాయమాణ | ... | ½ | ,, |
| కటుకి | ... | ¼ | ,, |
| దార్వి | ... | 1 | ,, |
| గుడూచి | ... | 1 | ,, |

కామిల, పిత్తజ్వరము, కడుపులోబల్ల మొదలగువాటికి చాలాఉపయోగము.

---

14 మన్యజ్వరహారి. 16 మాత్రలు 1 రూ.

ఇది మాయొక్క కట్టుమాత్ర. అతిసారము, భేదులు లేని సర్వజ్వరములలో యీ క్రింది 15 యోగముతో ఉపయోగింపవచ్చును. పూటకు రెండుమాత్రలప్రకారము దినమునకు 3 పూటలు యివ్వవలెను. 8 మాత్రలు ఉపయోగించిన వెంటనే జ్వరముజారును. 3 దినములలో జ్వరముకట్టును. 8 దినములు పుచ్చుకొనిన లోపలిజ్వరముకూడ హరించును.

15 ఆర్ద్రకాది స్వరసము

| | | |
|---|---|---|
| అల్లము | 1 | తు |
| ఓమము | 1 | ,, |
| జీలకర్ర | ¼ | ,, |

నీళ్లతో నూరి రసముపిండి, ఒక గరిట లోపొంగించి మన్యజ్వరహారితో పుచ్చుకొనవలెను.

---

16 భాస్కరలవణచూర్ణము. ఫ్రాటకు 0—2—0

| | | | |
|---|---|---|---|
| సైంధవలవణము | ... | 1 | తు॥ |
| బిడా ,, | ... | 1 | ,, |
| సౌవర్చల ,, | ... | 1 | ,, |
| ధనియాలు | ... | 2 | ,, |
| పిప్పిలి | ... | ½ | ,, |
| మోడి | ... | ¼ | ,, |
| ఆమ్లవేతసము | ... | 1 | ,, |

అన్ని చేర్చి చూర్ణముచేయవలెను. అజీర్ణము, మలబద్ధకము, వాంతులు, కడుపుబ్బరము మొదలగువాటియందు చాలా ఉపయోగముగనుండును. మోతాదు 1 నుండి 2 మాషములు.

17 తాళీసాది చూర్ణము పొట్లకు 0—2—0

| | | | |
|---|---|---|---|
| తాళీసపత్రి | ... | $\frac{1}{2}$ | తు॥ |
| త్రికటుకము | ... | 1 | ,, |
| వెమరుప్పు | ... | $\frac{1}{2}$ | ,, |
| ఏలకులు | ... | $\frac{1}{8}$ | ,, |
| కాస్ని | ... | $\frac{1}{2}$ | ,, |

అజీర్ణము, వాంతులు, దగ్గు మొదలగువాటియందు ఉపయోగింపవలెను. మోతాదు 1 నుండి 2 మాషములు.

18 మాధీఫల రసాయనము, 10 తు॥ 0—10—0

| | | | |
|---|---|---|---|
| త్రికటుకములు | ... | 1 | తు॥ |
| జిలకర్ర | ... | $\frac{1}{2}$ | ,, |
| సౌవర్చలవణము | ... | $\frac{1}{2}$ | ,, |
| మాధీఫలరసము | ... | 5 | ,, |

మోతాదు $\frac{1}{8}$-$\frac{1}{4}$ తు॥ పైత్యమునణచును.

19 సేతుబంధనగుళిక. 16 మాత్రలు 1—0—0

| | | |
|---|---|---|
| దాడిమబెరడు | 1 | తు॥ |
| మారేడుకాయగుజ్జు | 1 | ,, |
| త్రికటకములు | 1 | ,, |
| నాగకేసరము | 1 | ,, |
| అర్కమూలము | $\frac{1}{4}$ | ,, |
| ధాతకీపుష్పము | 1 | ,, |

మోతాదు 1-2 మాత్రలు చీము నెత్తురు విరేచనములలోను, భేదులలోను ఉపయోగించును.

20 చంద్రప్రభాగుళికలు. 8 మాత్రలు 1—0—0

గుగ్గిలము, తెగడ, లోహభస్మము, వెదురుప్పు, మాక్షికభస్మము, శిలాజిత్తు తు॥ 1, దంతిమూలము, లవంగపట్ట, యవక్షారము, సర్జక్షారము తు॥ ½, ఏలకులు ⅛.

4 గుంజలెత్తు మాత్రలు చేయవలెను. మో 1—2 అర్కాది క్వాథముతోగాని, కిరాటాదిక్వాథముతోగాని దివమునకు 3 పూటలు సేవించవలెను. జ్వరముండునప్పుడుమాత్ర పుచ్చుకొనవచ్చును.

---

21 ద్రోణపుష్పీస్వరసము.

తుమ్మిఆకు తు॥ 1, గుంటగలిజేరుఆకు 1, తులసిఆకు 1, విష్ణుక్రాంతము 1, మిరియాలు ¼ తు॥.

½ — 1 తు॥ వరకు రసముపిండి మన్యజ్వరహరిమాత్రలతో పుచ్చుకొన్న చలిజ్వరములు 2 దినములలో హరించును.

---

# ప్రథమాలోచనకు అనుబంధము.

" వెల్తు ఆఫ్ ఇండియా" అను మాసపత్రిక యీ విధముగనుడువుచున్నది. " కాలకాలమునకు మలేరియా జ్వరములు మనుష్యుల మూలకమేగాని చీగటీగలమూలకము కాదని అమెరికాలో చేసినపరిశోధనలవలన తెలియుచున్నది. 2000 చీగటీగలు లేకదోమలను కోసిపరీక్షించిచూడగా మలేరియా పురువులు లేకుండెను. 1184 జనులయొక్క రక్తమును పరీక్షించిచూడగా 492 మందిలో యీపురువులుండినవి" దీనినిబట్టి నవీనపాశ్చాత్య శోధకులుకూడ మలేరియా జ్వరములకు కారణము దోమలుకావని సిద్ధాంతపరచినట్టు తెలియగలము.

---

మార్కండీ=సునాముఖి, టంకణము=వెలిగారము, హేమక్షీరి=కంకోష్ఠము, స్నుహీక్షీరము=ఆకుజెముడుపాలు, ధాన్యాకము=ధనియాలు, సప్తపర్ణ=ఏడాకులుపొన్న, గుడూచి=తిప్పతీగె, కిరాట=నేలవేము, పాఠ=విషబొద్ది, హరీతకి=కరక్కాయ, వాలకము=కురువేరు, ధన్వయాస=తీటకసింధ, కంటకారి=నేలములక, ఇంద్రయవ=కొడిశపాలవిత్తులు, పటోల=చేదుపొట్ల, త్రిఫల=కరక, తాండ్ర, ఉశిరికలు, త్రికటు=శొంఠి, పిప్పిలి, మిరియాలు, దార్వి=మానిపసపు, అమ్లవేతసము=పుల్లప్రబ్బలి, కాస్ని=కాసినివేళ్లు, ధాతకీ=ఆరెపువ్వు, శతపుష్పి=సదాప, త్రాయమాణ=కలుగ్రానుగు.

ఆయుర్వేదోదయ గ్రంథమాల.

# ❀ పోషకులు, చందాదారులపట్టీ.

---

మ॥ రా॥ రా॥ శ్రీ కే. కృష్ణరావు గారు అనంతపురము.
„ *హెచ్. రామస్వామయ్యగారు. „
„ రూపనగుడి. సీతారామరావు „
„ పి. హనుమంతరావు „
„ హెచ్. జి. కృష్ణరావు „
„ డి. హొన్నప్పశెట్టి „
„ బడ్డి. రాఘవేంద్రరావు „
„ కే. నరసింహమూర్తి ఆచార్లు „
„ బి. మునస్వామినాయుడు „
„ కడప. బాలాజీరావు బళ్లారి.
„ కే. బ్రహ్మశాస్త్రి „
„ హెచ్. సుబ్బరావు బెంగుళూరు.
„ ప్రాణేశరావు „
„ సి. వి. కృష్ణస్వామి అయ్యరు, చెంగల్పట్టు.
„ డాక్టరు హెచ్. హనుమంతరావు చించోళి
„ అంకితం. వెంకటజగ్గారావుగారు చికాకోలు.
„ ఓ. వి. నంజుండయ్య „ కడప

| | | |
|---|---|---|
| మ॥ రా॥ రా॥ శ్రీ | సముద్రాల. సుబ్బయ్య | ధర్మవరము |
| ” | డి. పి. విశ్వనాథమయ్య | ” |
| ” | హెచ్. సుబ్బరావు | ధావనగిరి |
| ” | యర్రంశెట్టి సుబ్రమణియంగారు, | ఏలూరు. |
| ” | బి. సి. కృష్ణశాస్త్రులవారు | ఫ్రెంచ్ రాక్సు |
| ” | డాక్టరు. యం. లక్ష్మణరావు | ” |
| ” | కోటి. చంగలరావు, | గుర్రంకొండ |
| ” | నాగేశ్వరం సుందరం, దుగ్గిరాల, | గుంటూరు |
| ” | వెంకటేశ్వరులు గారు | ఇనగల్లు |
| ” | హెచ్. విశ్వనాథం ” | హోసపేట |
| ” | సి. నరశింగభాక్ ” | ” |
| ” | జే. రామచందర్ ” | హైద్రాబాదు |
| ” | *టి. రామరావుగారు | ” |
| ” | జి. నారాయణరెడ్డి ” | ” |
| ” | కే.వి. రెడ్డి ” | ” |
| ” | రాపోలి. తిరుమలరావు ” | ” |
| ” | మాడపాటి.హనుమంతరావు | ” |
| ” | పద్మా. వెంకటస్వామి వైద్యులు | ” |
| ” | పి. దొరస్వామిమొదలారు | జమ్మలమడుగు |
| ” | ఘుషియారం. చెంగయ్యగారు | ” |
| ” | లక్ష్మినారాయణయ్య | ” |

మ॥ రా॥ రా॥ శ్రీ కోరం. వెంకటరాఘవాచార్లు జమ్మలమడుగు
" ధోండూరావు "
" అణ్ణావర్ఝుల. పిచ్చయ్య "
" డి. విఠోబరావు "
" నరశింహులు నాయుడు "
" నరసురామయ్యగారు కర్నూలు.
" నిట్టూరు. రామస్వామయ్య "
" ఇంద్రగంటి వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రి "
" కే. కేశవ్ శింగ్ "
" అల్లమరాజు. శేషయ్య "
" నంద్యాల. నరసయ్య "
" వీపునగండ్ల సుబ్బయ్య "
" ఇంద్రగంటి. శింగయ్యగారి శేషయ్య "
" ఆర్. గిరిరావు "
" యం. శేషగిరిరావు "
" వి. శంకరశాస్త్రులు "
" కమ్మల సీతరామయ్యగారు కందుకూరు
" పండిత డి. గోపాలచార్లు చెన్నపట్టణము.
" కె. వి. చలపతిరావు "
" ఆర్. ఎ. శంకరనారాయణయ్య "
" ఆర్. గిరిరావు మదనుపల్లి.

మ॥ రా॥ రా॥ శ్రీ కనిగిరిరావు గారు మెదగ్.

,, ఆర్. నారాయణరావు వర్కాపురము.

,, *ఆర్. సదాశివయ్యగారు, చిన్నక్కల్లు.

,, *అర్. ఎల్లయ్యగారు ,,

,, రామాశాస్త్రులవారు మైసూరు.

,, బి. రామకృష్ణరావు ,,

,, యం. నరశింహ్మయ్య ,,

,, లక్ష్మీనరసింహ శాస్త్రులు ,,

,, కె. శీతాపతిరావుగారు నెల్లూరు.

,, శ్రీ ఉయ్యూరు రాజాగారు నూజవీడు.

,, యస్. నరశింగరావు బి.ఎ. ప్రొద్దుటూరు.

,, మన్యం. వెంకటరామయ్య బి.ఎ.బి.యల్.

,, రూపావతారం. శేషశాస్త్రులు ,,

,, జి. వెంకటరావుగారు పులివెందల.

,, యం. రాఘవాచార్లు రాయచోటి.

,, పార్సి. రాఘవేంద్రరావు రాజమహేంద్రము.

,, యస్.డి. రామచంద్రన్ శికింద్రాబాదు.

,, వి. కల్యాణసుందరం అయ్యరు ,,

,, పి. పళనివేలుపిళ్ళై ,,

,, టి. యం. కృష్ణరావు ,,

,, యస్. యస్. కృష్ణస్వామి ,,

మ॥రా॥రా॥శ్రీ మాశెట్టి వెంకన్న గారు శికింద్రాబాదు.
,, ఉ. కుప్పుస్వామి ,,
,, వెంకటస్వామి ,,
,, కొత్త. బాలరాజయ్య ,,
,, అబ్బగారి వీరయ్య ,,
,, సముద్రాల రామన్న ,,
,, పాత వీరన్న ,,
,, శ్రీ॥ పం॥ మార్కండేయశాస్త్రి ఆయుర్వేదభిషక్
,, చివుకుల అప్పయ్యశాస్త్రి గారు ,,
,, చెలువాది కోట్లింగం ,,
,, కొండభత్తిని లింగయ్య ,,
,, కాటిక. కృష్ణయ్యగారు ,,
,, సీతావీరచెంగయ్యగారు ,,
,, డాక్టరు. నరశింహులు ,,
,, కులశేఖరం మొదలారు ,,
,, మైసూరు. రమణయ్య ,,
,, తేర్ల. నారాయణశ్రేష్ఠి ,,
,, శింగం. వీరన్న ,,
,, విశ్వబ్రహ్మంబాయి లక్ష్మయ్య ,,
,, మిద్దెల. రామస్వామి ,,
,, గుండా. భూమన్న ,,

మ॥ రా॥ రా॥ శ్రీ దూసా. బాలయ్య వైద్యులు శికంద్రాబాదు.

„ పొన్నాల రాజయ్య „

„ విశ్వబ్రంహ్మం కొల్లూరుముకుందం „

„ రాజూరి. లింగయ్య „

„ మరపతి. విభూతిరాజేశ్వరయ్య „

„ చంద్రా. వెంకన్న „

„ వడుగూరి. వీరన్న „

„ ముచ్చర్ల. సాయన్న, తాపుద్దార్ „

„ దుందిగల్లు జగదీశ్వరయ్య „

„ పొద్దుటూరి వీరన్న శ్రేష్ఠి „

„ అమ్మనభోలు. వీరన్న శ్రేష్ఠి „

„ అలవాల నరశింహులు „

„ డి. వెంకట రామయ్య „

„ మొగడంపల్లి. మల్లయ్య „

„ బచ్చు రాఘవయ్య „

„ చామరాజయ్య „

„ తోడుపునూరి చంద్రయ్య „

„ అర్ని లక్ష్మణరావుగారు హాయిల్ పాడు

„ మద్దాల మల్లయ్య వరంగల్లు